# హామాం”
# శతకము

కృతికర్త:

## ఆత్మకూరి గోవిందాచార్య



దైవభక్తి మూల్యము



శ్లో. ఐంక్లీం సౌస్సావిద్యా
దద్యాచ్ఛం మే సౌఖ్యం



# అంకితము



శ్రీ నిలయంబవై కరుణచే జగమున్ జననీవిధాన సం
త్రాణము సేయు తొల్లిటి పరాత్పరమూర్తి, విరాట్స్వరూపిణీ
జానగు మోమువన్ మధురశాంతమృదూక్తుల భక్తరక్షణన్
బూను త్రిలోకసుందరి! త్రిమూర్తులతల్లి! యివే ప్రణామముల్

తిరువతియూరునం గల త్వదీయమనోజ్ఞసువిగ్రహమ్ము నే
నరసితి; నీదుదివ్య చరణాంబుజపూజల శాంతి నొంది, మై
మరచితి; నాటిరేయి నడుమన్ నను నిద్దుర లేపి రేరా "నన్
మరచితివా" యటన్న గతి మై బులకల్ జనియింప నంతటన్

కలముగ్రహించి విశ్రమము గానక యీ శతకమ్ము నెల్ల, మై
పులకల మున్గి మున్గి పరిపూర్తిగ వ్రాసితి నాటిరేయి నే
వలగొను భక్తి, నీదుపదవారిజభృంగమునై చరించుచున్
లలితమనోజ్ఞగీతమయలాలిత మీ శతకమ్ము కొమ్మదే.

కలమున నాట్య మాడితివిగా, భవదీయ కృపారసమ్మె నా
కలమునఁ జిందె, దానశతకమ్ము మనోహర మ్మౌట వింతయే
యిలఁగల సర్వకార్యము లహీనగతిన్ నెఱవేరనేర్చు నీ
విలసితమంత్రరాజము జపింపగఁ గైత లభించు టింతయో.

నీ కవితన్ గ్రహింపు మిక నీవె, యిదే కొను మంకితమ్ము, నీ
యాకృతిగాంచి నిన్నహృదయమ్మునఁ బాదుకొనంగ జేసి, యే
కైకమతిన్ జపించితిని నీవె వహింపఁగ నాదు రక్షణన్
నా కల మింక ధన్య మగు, నా బ్రదుకా తరియించు నంబరో.

భవజలధిన్ దరించుటకు భారము నీయదె, జన్మలిచ్చెదో !
భవదరుణోజ్జ్వలోత్తమశుభప్రదమంగళమూర్తినే, సత
మ్మవిరళదృష్టిఁ జూచెడి మహాతపమున్ గృపసేయుమమ్మ, నే
నవమతిఁ జేయుదుష్కృతి క్షమార్హముగాఁ గొని కావుమంబరో.

# మ న వి

1-10-1948 వ సంవత్సరము నాటి రేయి మదరాసు గవర్నమెంటు హౌసులో విడిదిచేసియున్నపుడు వ్రాసిన యీ శతకమును నేటికి ముద్రించఁగలిగితిని. భక్తకోటి చదివి యానందించెదరుగాక.

ఆత్మకూరి గోవిందాచార్యులు

# పీఠిక

శ్రీ కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు

శ్రీ ఆత్మకూరి గోవిందాచార్యులుగారు సుప్రసిద్ధ రాజకీయవేత్తలు, బహుగ్రంథకర్తలు.

గోవిందరామాయణము వ్రాసి, కవితాజగత్తునం బేరు గాంచినవారు.

ఇపుడు మరల నీ 'పాహిమాం' శతకము ప్రచురించుచుండిరి. వారు బాలోపాసకులు.

ఈ శతకమురచన పరమసుకుమారమై యున్నది అంబాస్తోత్రములు సంస్కృతమున మహాసుకుమారగ్రంథములు.

మూకకవిశతకముకంటె సంస్కృతమున సౌకుమార్యగుణ మధికముగాఁ గల కావ్య మేమున్నది? తలిని తలచినంతనె మాట సుకుమార మగును గాఁబోలు.

ఇందుఁ గల సౌకుమార్యమునకు బాలాంకిత త్వమే కారణము.

కొన్ని భావములు సంస్కృతమున నెవ్వరు వనని యంతటి రమ్యముగా నున్నవి.

ఏది నీ పాఠశాల అం దెట్టివిద్య
నభ్యసింతువు నీ పుస్తకార్థ మేమి
ఎవరి సహవాసముం జేతువే కుమారి !

ఈ భావ మామె బాలాభావము దీపింప చేయుచు నేటి సంఘస్థితిని చూపుచున్నది. మిగుల రమ్యముగా నున్నది.

మరియు నీ కవిగారియొక్క కొన్ని భావములు సుకుమారాతిసుకుమారముగానుండి తత్త్వదీపకము లుగా నున్నవి. ఈ పద్యము చూడుడు,

జనని నీవు చేఁబూను పుస్తకమునందు
నక్షరము నొకదు నచ్చటో అంతె చాలు.

తక్కిన గ్రంథ ముపాసనాభాగమయిన తత్త్వ విషయములతో నిండియున్నది.

చిట్టచివరకు. 'త్వయి ప్రసన్నే మమ కిం గుణేవ త్వయ్యప్రసన్నే మయి కిం గుణేన' అన్నట్లు.

మామకీనగుణమ్ముల మాట యేల
అంబ ! నీవు ప్రసన్నవా ! అయిన ధన్య
తముడఁ గాకున్న నేఁ జేయఁ దగిన దేమి.

ఇది పరమప్రపత్తిలక్షణము.

అంబ అపమృత్యు నివారిణి. శ్రీ ఆచార్యులు గారి దెస ప్రసన్నురాలగుత.

ఈ స్తోత్ర మాంధ్రభక్తులనోట నలరారుగాత.

విశ్వనాథ సత్యనారాయణ
బె జ వా డ
27–9–52

# "పాహిమాం" శతకము

శ్రీస్వరూపిణి! ప్రణవాంబ! త్రిపురదేవి
నిఖిలలోకైకసుందరి! నిత్యమూర్తి!
కోటి సూర్యప్రభాదీప్త! కోమలాంగి!
పాహిమాం పాహి, బాల! తుభ్యం నమోస్తు. 1

ఎన్నఁడో బాల్యమందున ఎఱుక లేని
ఒక్కవ్యక్తి యీ ఉపదేశ మొసఁగినాఁడు
నాటనుండియుఁ గొల్చుచున్నాఁడ నిన్ను
పాహిమాం పాహి, బాల! తుభ్యం నమోస్తు. 2

బాల వయ్యును బ్రహ్మాండవర్గ మెల్ల
సృష్టిఁ జేసెడి నీదు విచిత్రశక్తి
కెవరు "దాసోహ" మనరు నీ కెవరు సాటి
పాహిమాం పాహి, బాల! తుభ్యం నమోస్తు. 3

అతులతరసుందరాంగివై యలరుచుండి
చిఱుతప్రాయాన నీమహాచిద్విలాస
మెట్లు భరియించు చుంటివో యెఱుక నీకె
పాహిమాం పాహి, బాల! తుభ్యం నమోస్తు. 4

ఆ జపపుటియు పుస్తకమ్మభయముద్ర
ఫుల్ల కల్హారమాలయు పూనిబ్రోచు
నిత్యకల్యాణశీల "ఓం" నిలయబాల
పాహిమాం పాహి బాల తుభ్యం నమోస్తు. 5

మురిపెములు తాండవం బాడు ముద్దుమోము
కన్నుఁగవనుండి చిల్కుఁ బ్రసన్నసుధను
అబలవై జగన్మోహిని వైన తల్లి
పాహిమాం పాహి బాల తుభ్యం నమోస్తు. 6

అందమున శాంతమును శాంతమందు నంద
మైక్య మొందిన నీ విగ్రహంబు సకల
జగతి సమ్మోహితము సేయఁ జాలు దేవి
పాహిమాం పాహి బాల తుభ్యం నమోస్తు. 7

నీలమేఘాలపైని వినీలవిపుల
గగనభాగాన రిక్కపూగములఁ బూని
అమరవాహిని విహరించు విమలమూర్తి
పాహిమాం పాహి బాల తుభ్యం నమోస్తు. 8

అరుణకిరణాఢ్యమూర్తి దివ్యప్రదీప్తి
నుదుట బొట్టుగ నిడుకొన్న నూత్నశోభ
నంచితాశావకాశసువ్యాప్తమూర్తి
పాహిమాం పాహి బాల తుభ్యం నమోస్తు. 9

ఏది నీపాఠశాల ? యం దెట్టి విద్య
నభ్యసింతువు నీ పుస్తకార్థమేమి ?
ఎవరిసహవాసముం జేతువే కుమారి
పాహిమాం పాహి బాల తుభ్యం నమోస్తు. 10

వదనబింబంబు నీకు నివాస మొక్క
వాస మొనరింతువా నీవు వక్ష మందు
నర్ధదేహమ్ము నీ వౌదువా కుమారి
పాహిమాం పాహి బాల తుభ్యం నమోస్తు. 11

కాదు మూర్తిత్రయమ్మున కాదియందె
సృజనముసేసి నీమహాశక్తినుండి
సతుల నొసఁగవె జగముల సాకుకొఱకు
పాహిమాం పాహి బాలతుభ్యంనమోస్తు. 12

మువ్వురమ్మలు నే మహామూర్తికళలో
సకలగుణవర్గ మే దివ్యశక్తిగతులో
యఖిల లోకైకమాత నా యమ్మ నెంతు
పాహిమాం పాహి బాల తుభ్యం నమోస్తు. 13

ప్రకృతి పురుషుల యందు దాఁ బరగుచుండు
నేకమై యేమహాశక్తి, యెద్ది మువురు
మూర్తులకుఁ దల్లి, యా మహామూర్తి నెంతు
పాహిమాం పాహి బాల తుభ్యం నమోస్తు. 14

సకలమును నీవమై జగచ్ఛ్రయమునందు
లీనమై యుందువా ? జగల్లీల నీదా ?
యణువును మహత్తునీవయి యలరుదమ్మ
పాహిమాం పాహి బాల తుభ్యం నమోస్తు. 15

నే ననెడి భావమున్ వీడి నిన్ను నమ్మి
"అన్యథా శరణం నాస్తి" యనెడి వారిఁ
బ్రోవఁగాఁ జూచు లోకైకపూత మాత
పాహిమాం పాహి బాల తుభ్యం నమోస్తు. 16

గౌరి వారాహి వైష్ణవి నారసింహి
మొదలుగాఁ గల శక్తులఁ బుట్టఁ జేసి
దుష్టశిక్షణ మొనరించు ద్రష్ట్రిఁ దలతుఁ
పాహిమాం పాహి బాల తుభ్యం నమోస్తు. 17

ఆ శరత్కాల చంద్రిక యా హిమాద్రి
యల్ల గంగా తరంగాలు నాటపట్టు
లమ్మ యవియె నీ చల్లదనమ్ముకతమొ
పాహిమాం పాహి బాల తుభ్యం నమోస్తు 18

తనదు శక్తిని నడిపించు తనయుఁ దలఁతు
సగుణనిర్గుణ రూపమై సకలజగతి
కార్యకారణరూపసంగతులఁ బొంది
పాహిమాం పాహి బాల తుభ్యం నమోస్తు 19

మల్లెపూసెజ్జ గృహ మమ్మ మందమారు
తమ్మె శయనించు పాన్పమ్మ తరుణ కేసల
యమ్ములే నృత్య మాడు ధామమ్ము లమ్మ
పాహిమాం పాహి బాల తుభ్యం నమోస్తు. 20

బాలకుఁడు బొంగరం బాడు పగిదిఁ బ్రకృతి
జీవులను బొంగరమ్ములఁ నీవు సారె
త్రిప్పుచుందువు నీయాట చొప్పెల్ల
పాహిమాం పాహి బాల తుభ్యం నమోస్తు. 21

మలినహృదయాన నీ వెట్లు మనుదు వమ్మ
పావనమ్మెట్లు సేతు వాపాపహృదిని
ఆకళంకమ్ము నీకంటదా! యదేమొ
పాహిమాం పాహి బాల తుభ్యం నమోస్తు. 22

పతితపావని ? నీకె పోపాడి యట్లు
సర్వమమకారములఁ దృప్తి సలిపి సలిపి
ఐక్య మొందెదవమ్మ భక్తాళియందు
పాహిమాం పాహి బాల తుభ్యం నమోసు. 22

ప్రకృతియందలి మోహాసర్వస్వ మూని
పట్టి సౌందర్యమెల్ల నవ్వానిఁ బొంది
యారయ యసదృశమోహిని వైతి వమ్మ
పాహిమాం పాహి బాల తుభ్యం నమోస్తు. 23

నిన్నుఁ గనువాఁడు నీరూపనిధులయందె
తన్మయుం డౌచు నిన్నె పో తలఁచి తలఁచి
నీదు రూపమ్మె తనముందు నిల్వ నెంచు
పాహిమాం పాహి బాల తుభ్యం నమోస్తు. 24

నిన్ను నిరతమ్ముఁ జూచుచు నున్నవాని
యింద్రియము లెప్పుడును జలియింప వమ్మ
ఎట్టి వన్నెలాడియుఁ దటిఁ బట్టి యున్న
పాహిమాం పాహి బాల తుభ్యం నమోస్తు. 25

ఓవహో! యాశాంతములఁ గమ్ము నా హిమమ్మె
నీకు వసనమ్ము కాఁబోలు నీ కిరీట
మొకొ ్క యాకాశతల మెల్ల నొడలొ ప్రకృతి
పాహిమాం పాహి బాలతుభ్యం నమోస్తు. 26

భయద మేఘావృతాకాశ లయవిభీతి
దుర్భర మహాంధకార ఘోరార్భటులను
వెడలు మెఱపులు నీ కృపావీక్షణములె
పాహిమాం పాహి బాల తుభ్యం నమోస్తు. 27

గంధవాహనోద్ధూతమై కడలినెల్ల
నావసంతసాయంతన మ్మవతరించు
వలలు నీ విలాసంపుటుయ్యాల లమ్మ
పాహిమాం పాహి బాల తుభ్యం నమోస్తు. 2

నీదు విభవమ్ము నెంచఁగా నేరితరము
తావకీన మహాశక్తిఁ దలఁప వశమె
నిన్ను స్మరియించుటే చాలు తెన్ను గనఁగ
పాహిమాం పాహి బాల తుభ్యం నమోస్తు. 39

సర్వదౌర్భాగ్యశమనమ్ము సర్వదుఃఖ
వారణమ్ము శుభావాప్తి కారణమ్ము
నీ సతము దివ్యనామ సంస్మరణ నిజము
పాహిమాం పాహి బాల తుభ్యం నమోస్తు. 30

ఏ పదమ్ములు చెప్పఁగా నోపు నిన్ను?
శబ్దశక్తి కతీతమ్ము సకలవిద్య;
వినుతి సేయంగఁ దరమె కోవిదుల కైన
పాహిమాం పాహి, బాల! తుభ్యం నమోస్తు. 31

సులభవో దుర్లభవో వేదసూక్తి యేమొ
ఆ సుధామయనేత్ర త్రయమ్ముఁ దెలిచి
భక్తులకు దాసిగాఁ గూడఁ బరగఁగలవు
పాహిమాం పాహి, బాల! తుభ్యం నమోస్తు. 32

నీదువాత్సల్యగుణమునే నిల్పి హృదిని
మానసికవృత్తి నీ మహామహిమ నెంచి
భక్తితోడ సమాధిలోఁ బరగఁదగును
పాహిమాం పాహి బాల తుభ్యం నమోస్తు. 33

ఆ త్రికోణసంస్థితిఁ బూని అరుణదీప్తి
నాల్గుభుజముల భక్త సంత్రాణ మూను
వేదసారస్వరూపిణీ వేదమూర్తి
పాహిమాం పాహి బాల తుభ్యం నమోస్తు. 34

జన్మజన్మల శత్రుసంచయముతోడఁ
బోరి పోరాడి యలసట బొందు జీవి
యెన్ని జన్మల నెత్తెనో యింతదాఁక
పాహిమాం పాహి, బాల! తుభ్యం నమోస్తు. 35

ఆ సహజశాత్రవతతిని హత మొనర్ప
శక్తి లేమిని తుది గనఁ జాల నట్టి
జననమరణాల సుడి జీవి గనదు తెన్ను
పాహిమాం పాహి బాల తుభ్యం నమోస్తు. 36

అమ్మహాశత్రుజయము లభ్యమ్ము గాదు
కాదు ముమ్మాటికిని శక్తి రాదు రాదు
త్వత్కృపాలేశ మైన ప్రాప్తమ్ము గాక
పాహిమాం పాహి బాల తుభ్యం నమోస్తు. 37

యోగిఁగా లేను నీకృపాభోగిఁగాక
హఠము నేర్వఁగ నేర నిన్నర్తియుండ
నిశ్చలధ్యాన మం దైన నిల్వ లేను
పాహిమాం పాహి బాల తుభ్యం నమోస్తు. 38

కదలి వలె నుండుగా బుద్ధి, కదల కుండ
నుండ గలుగునె, యేమేమొ యూహ లెపుడు
అట్టె పుట్టుచుఁ బెరుగుచు నంతరించు
పాహిమాం పాహి, బాల! తుభ్యం నమోస్తు. 39

ధారణ లభింపదాయె నిన్ దలఁచి తలఁచి
భ్రూకుటిన్ దృష్టిఁ జేర్చి త్వత్సువ్రజ్యలలిత
దివ్యరూపమ్ము నే యెడ తెగక చూడ
పాహిమాం పాహి బాల తుభ్యం నమోస్తు. 40

ఎంతజపియించినన్ గూడ నెంత యొంతొ
ధ్యాన మొనరించినం గూడ గానరావు
కాని పిలువని పేరంట మూనుదీవు
పాహిమాం పాహి బాల తుభ్యం నమోస్తు. 41

పూలజడలు నితంబాలమూల నంట
పూలబంతులు చేఁబూని, పాలయిండఁ
బూలమాల నటించెడి ముద్దుమూట
పాహిమాం పాహి బాల తుభ్యం నమోస్తు. 42

ఒడలు బంగారుతోడుగుగా నుండు నట్టి
మున్ను చూడని భూషణముల్ ధరించి
ఇచ్ఛమై వచ్చి దర్శన మిడుదువమ్మ
పాహిమాం పాహి బాల తుభ్యం నమోస్తు. 43

కర్ణముల వెల్గు నా మణిఖచితదీప్త
విమల శ్రీ చక్రములఁ బ్రతిబింబితమ్ము
నీ మహాదృష్టి దాని గణింప వశమె
పాహిమాం పాహి బాల తుభ్యం నమోస్తు. 44

నీ యురస్స్థలి, నవరత్న నిర్మితమ్ము
ప్రకృతి ప్రతిబింబితమ్ము నాపదక పునవ
కాంతి నన్నెక్క తళ్కుగాఁ గాలవిమ్ము
పాహిమాం పాహి బాల తుభ్యం నమోస్తు. 45

పరమశాంతిపిపాసకు బలిగ నైతి
నీదు హస్తాబ్జ మధువు సుం తెని యిమ్ము
హృదయ మంత స్పందించి నిన్నె తలంచు
పాహిమాం పాహి బాల తుభ్యం నమోస్తు. 46

సంగమము గాని యే మహాలింగనమ్ము
గాని వలదింక వలదింక, కర్మబద్ధ
జీవుఁ డిహసౌఖ్యగతిఁ దృప్తిఁ జెందఁగలఁడె
పాహిమాం పాహి బాల తుభ్యం నమోస్తు. 47

పూర్వకర్మ నశింపఁగా ముందు కర్మ
పాపరహితంబుగాఁ జేయు ప్రజ్ఞ నీది
అట్లొనర్పుము తరియింప నంతె కోర్కె
పాహిమాం పాహి బాల తుభ్యం నమోస్తు. 48

దివ్యవనితా మహామోహ భవ్యసుఖము
ప్రకృతి జలధికి నౌకయై పరగు నమ్మ ?
పూర్వసంస్మృతి పదపడి పుట్ట దొకో ?
పాహిమాం పాహి బాల తుభ్యం నమోస్తు. 49

ప్రకృతి విస్మృతిఁ గలిగించు రహిఁ జెలంగి
నిన్నుఁ దలఁచుచుఁ గొలుచుచు నిన్నుఁ గాంచి
సతము "దాసోహ"మన నిమ్ము చాలు నంతె
పాహిమాం పాహి బాల తుభ్యం నమోస్తు. 50

అంఘ్రితలమున శిరసుంచి యుత్సుకముగఁ
బాంసుకణముల ధరియించు భాగ్యమిమ్ము
ఆ కణములె శిరస్త్రాణమౌత నాకు
పాహిమాం పాహి బాల తుభ్యం నమోస్తు. 51

ఆదితాళాన, సృష్టిరంగాదినుండి
అంత్య మౌదాక సతతనృత్యమ్ము సల్పు
నీ యనంత మహానృత్య నియతి నెంతు
పాహిమాం పాహి బాల తుభ్యం నమోస్తు. 52

ఆదితాళాన నీదు మూఁడక్షరాల
గీతికాగాన ముంజేతుఁ గెరలి కెరలి
నీదు వెనువెంట నృత్యమ్ము నే నొనర్తు
పాహిమాం పాహి బాల తుభ్యం నమోసు. 53

అపు డపుడు నిన్ను ఐంఅని యనుభవింతు
క్లీం అనుచు నేనె నీవుగా గెరలుచుందు
సౌః అనుచు సర్వజగతిని సాకనెంతు
పాహిమాం పాహి బాల తుభ్యం నమోస్తు. 54

స్త్రీని నేనని భావన చేసినేసి
ఓహో ! పురుషుండ నేనని యూహ సేతు
స్త్రీ పురుషమూల మీవని తెలిసి కొనఁగ
పాహిమాం పాహి బాలతుభ్యం నమోస్తు. 55

స్త్రీపురుషమూర్తి నే నని చిద్విలాస
నృత్య మొనరింతుఁ బ్రకృతి, సర్వేంద్రియమ్ము
లన్నియుం గూడ నాలోన నమరి నట్లు
పాహిమాం పాహి బాల తుభ్యం నమోస్తు. 56

వంశవశమున లోకమ్ము వశముగాన్న
బాలకృష్ణుండు మున్ముందు లీల నిలుచు
మూల మనులోమము విలోమముగ జపింప
పాహిమాం పాహి బాల తుభ్యం నమోస్తు. 57

కృష్ణుఁడవొ నీవు కృష్ణమ్మ వేమొ, నీయ
నంత బాలలీలన్ జొక్కి సంతతమ్ము
తన్మయుఁడ నౌచు నమృతతత్వంబు గాంతు
పాహిమాం పాహి బాలతుభ్యం నమోసు. 58

మాతృరూపమ్మ ధరియించి మామకీన
పోషణమ్మను జేయవే పుత్రురీతి
నాదినుండి యంతమ్మన కదియె కోర్కె
పాహిమాం పాహి బాల తుభ్యం నమోస్తు. 59

పుత్రికారూపముం బొంది పుట్టుదమ్మ
భక్తులకు, పుట్టవమ్మ నీ పరమలీల
ననుభవించుచు సాకెద రనవరతము
పాహిమాం పాహి బాల తుభ్యం నమోస్తు. 60

నెచ్చెలివిగాఁగ నుండఁగా నేర్తు వమ్మ
భక్తులకు కోర్కెయిటు లుండ వలదు కాని
సోదరుల రీతి సహవాస సుఖము గాంత్రు
పాహిమాం పాహి బాల తుభ్యం నమోస్తు. 61

అమ్మ సంయోగమును వియోగమ్మ వలదు
వీఁడు దాసత్వమే కోరువాఁడు సుమ్మ
నీదు దాసదాసుండుగా నిరత ముండు
పాహిమాం పాహి బాల తుభ్యం నమోస్తు. 62

విద్యలకు మూలమైన నీ విద్యయబ్బి
యాత్మ పరిణతిగాంచుచు ననవరతము
నజ్ఞుడైనను విఖ్యాతవిజ్ఞుఁడగును
పాహిమాం పాహి బాల తుభ్యం నమోస్తు. 63

వివిధశాస్త్రార్థ వీథుల విరతిలేక
ద్రిమ్మరఁగఁ జేయుదానవు కమ్మఁదనపుఁ
గవిత వ్రాయింపఁగాఁగల కలిమి నీదె
పాహిమాం పాహి బాల తుభ్యం నమోస్తు. 64

జీవితపథమ్ము కష్టసంశ్లిష్ట మయ్యు
ప్రేమతత్వమ్ము నేయెడ వీడకుండ
పరహితార్థమ్మె జీవింత్రు భక్తులెపుడు
పాహిమాం పాహి బాల తుభ్యం నమోస్తు. 65

మాటయే ఖడ్గమై వైరి మాయ లెల్ల
చెండి చెండాడఁ గలదు ప్రచండరీతిఁ
గాని నీభక్తులకురాదు కఠినవాక్కు.
పాహిమాం పాహి బాల తుభ్యం నమోస్తు. 66

ఎవ్వరిని గాని వైరిగా నెంచలేరు
నీదుభక్తాళి క్రోధమే రాదు మదికి
సహజవైరుల మాత్రమె సరకు గొంద్రు
పాహిమాం పాహి బాల తుభ్యం నమోస్తు. 67

ధర్మమార్గావలంబన కర్మ మొండె
పూని నీభక్తకోటి భూజాని నైన
సరకుసేయరు త్వన్మహాశక్తి వలన
పాహిమాం పాహి బాల తుభ్యం నమోస్తు. 68

ఇంక సహజారులంగూడ నెంచు టేల
వారిగురినుండి తప్పించు బాధ్యతయును
భక్తతతిపట్ల బూనఁగా వలయు నీవె
పాహిమాం పాహి బాల తుభ్యంనమోస్తు. 69

ఓహో సంచితము నశించునోయటంచు
తలఁపఁగా రాదు నీ కృపావలయరక్ష
సంచిత మ్మెల్లఁ ద్రుటిమాత్ర సమయమున్న
పాహిమాం పాహి బాల తుభ్యం నమోస్తు. 70

సంచితాగామి కర్మల సరణిమాత్ర
మేల తలపోఁత నీ భక్తుఁ డెట్టి గతిని
బొంద నర్హుండొ యదె వాఁడు పొందఁ గలఁడు
పాహిమాం పాహి బాల తుభ్యం నమోస్తు. 71

సర్వధర్మంబులను వీడి, జనని, నీవె
శరణ మను నంత భక్తుల సాకఁ గలవు
అల్పగతి. దోషతతియు తుమార్గ మగును,
పాహిమాం పాహి బాల తుభ్యం నమోస్తు. 72

తప్పులో యొప్పులో యేవి దలఁచి యైన
భక్తతతి నంటియుందు వాసక్తితోడఁ
బ్రేమమూర్తివె నీవాట విడువ వెపుడు
పాహిమాం పాహి బాల తుభ్యం నమోస్తు. 73

తలఁచు తలఁ పెల్ల నీకుఁగాఁ దలఁప వలయు
పలుకు పలు కెల్ల నిన్నెంచి పలుకవలయు
చేయు పనియెల్ల నీకునై చేయవలయు
పాహిమాం పాహి బాల తుభ్యం నమోస్తు. 74

జనని నీవు చేఁబూను పుస్తకము నందు
నక్షర మ్మెచ్చటనొ యాదు నంతె చాలు
సకలవిజ్ఞానమూర్తిగా జన్మ సాగుఁ
పాహిమాం పాహి బాల తుభ్యం నమోస్తు. 83

అరుణకిరణ సమూహమ్ము లలముకొన్న
నీ మహాదీప్తి నాదు నే నెరసు గాఁగ
తిమిర మను మాట వినకుండఁ దిరుగు వాఁడ
పాహిమాం పాహి బాల తుభ్యం నమోస్తు. 84

శిష్టరక్షణ సమయ విశిష్టదృష్టి
నేలు కొనుమమ్మ నన్ లయకాలదృష్టి
వలదు దానిని గనఁ జాలు ప్రజ్ఞ లేదు
పాహిమాం పాహి బాల తుభ్యం నమోస్తు. 85

ఫుల్లకల్హార సంస్థవై మూడు కనులఁ
జల్లగాఁ జూడు మంబరో శాంతి గాంతు
విలయతాండవరూపమ్ము వలదు వలదు
పాహిమాం పాహి బాల తుభ్యం నమోస్తు. 86

ఫుల్లకల్హారమాలఁ జేఁబూనఁజూతు;
గదయు ఖడ్గమ్ముఁ బూను నీ కరము చూచి
యోపఁ గలవాఁడనా? భీతి నొందకుండఁ
పాహిమాం పాహి బాల తుభ్యం నమోస్తు. 87

ఓహో పద్మాసనాసీతి నొప్పు నిన్ను
మృదుతమాభీతి హస్తవై మెఱయు నిన్ను
భీకరాకృతిఁ జూడ విభీతి గలుగు
పాహిమాం పాహి బాల తుభ్యం నమోస్తు. 88

బాలవై నిత్యమంగళశీల వగుచు
దనరు నీ దివ్య సుందరతనువుఁ గాంతుఁ
దగదు త్వద్విశ్వరూప సందర్శనమ్ము
పాహిమాం పాహి బాల తుభ్యం నమోస్తు. 89

ఎప్పుడో, యెట్లొ యీ జన్మ మిటులఁ గాంచి
దారియుం దెన్ను గానక తరలుచుంటి
నెటకో యెప్పుడు పోదునో యెఱుక లేక
పాహిమాం పాహి బాల తుభ్యం నమోస్తు. 90

జనన మరణ గృహమ్ము తే సరణిఁ దప్పి
వానికిఁ గవాటముల్ మూత వడవా! లేవా
యీ తిమిరమందిర నివాస మెటు నశించు
పాహిమాం పాహి బాల తుభ్యం నమోస్తు. 91

మార్పు లేనట్టి యీ గతి మఱల మఱల
ననుభవింపంగ దుర్భర మగుచు నుండె
వేఱు మార్గానఁ బోవఁగాఁ దీర దేమొ!
పాహిమాం పాహి బాల తుభ్యం నమోస్తు. 92

ఈప్థ మొ, యేపథమ్మొ యేదేని కాని
నీ కృపావీక్షణం బొంద నేర్చినాఁడ
దానఁ దరియింతు సత్యపథమ్ము నిదియె
పాహిమాం పాహి బాల తుభ్యం నమోస్తు. 93

భిక్షుకుఁడ నైన నీ పేర భిక్ష సేతు
ధనికుఁడనె నైన నీపేర దాత నౌదుఁ
దినెడి తిండియు నిన్ గొల్వఁ దినెడివాఁడ
పాహిమాం పాహి బాల తుభ్యం నమోస్తు. 94

రాజ్య మిచ్చెద నందువా రాజునగుచు
ధర్మపాలన సేతు నిన్ దలఁచి తలఁచి
లోకతతి యెల్ల సుఖయించు పోకతోడఁ
పాహిమాం పాహి బాల తుభ్యం నమోస్తు. 96

వంశవృద్ధి నొసర్తువా బాలపేరఁ
దనరరే పిల్ల లెల్లరుఁ దరతరముల
నీవె యిలు వేల్పుగా నుండ నేర్తువమ్మ
పాహిమాం పాహి బాల తుభ్యం నమోస్తు. 97

ముప్పదియు నైదు వత్సరముల్ జపించి
నీ మహిలశక్తి నిందాక నిల్చినాడ
స్థిరయశుండనై నీ మహాశీస్సు బలిమి
పాహిమాం పాహి బాల తుభ్యం నమోస్తు. 98

పాపకర్మరతుండనై "పాహి"యంచుఁ
గోరఁగాఁ బోను సత్కర్మఁగూడి "పాహి
పాహి"యంచును సతతంబు పాడువాఁడఁ
పాహిమాం పాహి బాల తుభ్యం నమోస్తు. 99

నిత్యకళ్యాణశీల ! నిన్నెతలంచు
చిత్తముంచుము విస్మృతి నొందకుండ
నేగతిని గాని, యెటనున్న నెపుడుగాని
పాహిమాం పాహి బాల తుభ్యం నమోస్తు. 100

ఇదిగో హృదయ పుష్పమ్ము నీ కిచ్చుచుంటి
నిదిగో గీతమాలిక నీకె యిచ్చుచుంటి
నిదిగో మంగళహారతి నిచ్చుచుంటి
పాహిమాం పాహి బాలతుభ్యం నమోస్తు. 101

నాదబిందు కళామూర్తి నవరసంపు
దావి వెదచల్లు క్రొత్తగీతాలపూల
మాల నష్టోత్తరశతమ్ము లీలఁగొనుము
పాహిమాం పాహి బాల తుభ్యం నమోస్తు. 102

సంతతశుభప్రదాయినీ ! సర్వలోక
జనని ! నీప్రసాదమ్ము నా సరసకవిత
నీవె కొను మంకిత మ్మిదె యిచ్చుచుంటి
పాహిమాం పాహి బాల తుభ్యం నమోస్తు. 103

"అన్యథాశరణం నా స్తి" అంబ రో త్వ
మేవశరణమ్ మమ" యటంచు నిదిగొ యిపుడె
కరములను మోడ్చు నీపాదకమలసీమఁ
పాహిమాం పాహి బాల తుభ్యం నమోస్తు. 104

మామకీన గుణమ్ముల మాట యేల ?
అంబ ! నీవు ప్రసన్నవౌ ? యయిన ధన్య
తముఁడఁ గాకున్న నేఁజేయఁ దగిన దేమి ?
పాహిమాం పాహి బాల తుభ్యం నమోస్తు. 105

మంగళమ్మని పాడు నీ మహితగాన
మందు లయ మొంది నాగీత మమృత మగుత
భక్తజనకల్పవల్లివై పరగుఁ గాతఁ
పాహిమాం పాహి బాల తుభ్యం నమోస్తు 106

మంగళత ప్రదాయినీ మహితదీప్తిఁ
గనులపండువుగాఁగ నీకంఠసీమ
నలరు నా గీతమాల నిరంతరమ్ము
పాహిమాం పాహి బాల తుభ్యం నమోస్తు. 107

అమ్మ యాశీర్వదింపుమీ యనవరతము
మంగళమ్మగు నీకు సుమంగళమ్మ
మంగళమ్మగు నాకు సుమంగళమ్మ
పాహిమాం పాహి బాల తుభ్యం నమోస్తు. 108

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

ఇది

మహాత్మాగాంధి, భారతదేశ ఆర్థికచరిత్ర, రాజ్యాంగ
చరిత్ర-గోవిందరామాయణేత్యాది గ్రంథ
కర్త శ్రీ ఆత్మకూరి గోవిందాచార్య
విరచిత శ్రీ బాలాత్రిపురసుందరీ స్తవ
"పాహిమాం" శతకము

సర్వము సంపూర్ణము

శ్రీ బాలా త్రిపురసుందరీ దేవతా సమర్పణమస్తు.

పట్టాభిరామా ముద్రాక్షరశాలయందు ముద్రింపబడియె. — 1952

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| పీఠిక ! | 4 | రామాణము | రామాయణము |
| iii | 4 | మయు | మము |
| 2 | 5 | ముద | ముద్ర |
| 2 | 6 | మాంయు | మాలయు |
| 5 | — | 1,2,3 పంక్తులు | 3, 2, 1 పంక్తులుగ చదువవలెను. |
| 8 | 15 | నీసతము | సతమునీ |
| 12 | 14 | సుంతెని | సుంతేని |

22 వ పద్యమునుండి పద్యసంఖ్య పొరపడినది. పద్యసంఖ్యను 94 వ పద్యమువరకు ఒకటి కలుపుకొనవలెను.